## చించోలి తహసిల్దారుగారి అనుగ్రహములు

గుల్బర్గాజిల్లాలోచేరిన పెద్దమల్ గ్రామానికి ౩-౧౨-౫౦ ఫ- నాడు చించోలి తాలూకా తహసిల్దారుగారువచ్చి అనేకములైన అనుగ్రహములు చేసినట్లు ఒక విలేఖరి తెలుపుచున్నాడు. గ్రామంలోచంద్రాపోగుచే కలరావ్యాధిమూలమున ఆవాధులైన, ఆగ్రామజనులకును నాలుగుబస్తాల జొన్నలుపంచిపెట్టించిరట- పెద్దమల్ గ్రామంలో ఒకవీధితిరిగి పరిశుభ్రతనుగురించి బోధచేసి. పెంటకుంటలు పూడ్చింపవలెననియు, వారిలో రాళ్ళగోడలు తీసివేయింపవలెననియు మురుగు నీటికాలువలను బాగుచేయింపవలెననియు పటేలు ట్వారీలకుచెప్పిరి- 'దక్కన్ లైబ్రరీ'అను పేరుతో గ్రంథాలయమును స్థాపించుకొనుటకు అనుజ్ఞకోరగా అనుజ్ఞ అవసరములేకుండానే స్థాపించుకొనవచ్చునని-

### పోలీసు వ్యవహారములు

గుల్బర్గానుండి పోలీసువద్దారు మెంహాతెమీంగారువచ్చి పెద్దమల్ లో మూడుకోజులుండి అమీనాకచేరిదఫ్తరు తనఖీచేసిరి- ౬-౧౨-౫౦ ఫ- నాడు గ్రామంవెలుపల ఒకబావిలో కుమారుడు ౨౦ ఏండ్ల కాపుయువతిపడి చనిపోయియుండగా అమీనాగారితోకూడ మదద్గారు మెంహాతెమీంగారుకూడ బావివద్దకుపోయి పంచునామాచేసి, శవమునుపూడ్పించిరి- ఆకాపుయువతి కడుపునొప్పిబాధవల్ల ఇట్లుఆత్మహత్య గావించుకొని యుండవచ్చునని జనులనుకొనుచున్నారని విలేఖరి తెలిపినాడు-

### వెట్టిపద్ధతిమానుట

దుర్శాపురం స్టేషనుకు అర్థమైలుపైన రేగొండి గ్రామంలో ప్రతిఫలమీయకుండ వెట్టికోనుచున్నారను ఆక్షేపణచెప్పి వెట్టిపనులవారలు రెండుమాసాలనుండి వెట్టిమానివేసియున్నారట. ఈ సంగతి యొక్క ప్రభావముచేత శేకాలోలు, పెద్దమల్ గ్రామంలోకూడ వెట్టిచేయువారలు ఈకాలంలో శ్రమకుతగిన ప్రతిఫల [illegible]

## సదాశివపేటలో జీవరక్షా ప్రచారము

(స్వ-విలేఖరి) ౧౩-౮-౪౧

ఇక్కడ ఈసారికూడ దుర్గాదేవిజాతరలో జంతుబలి నిశ్చయింపగా జరుగునని యిక్కడికొందరు అహింసావాదులు యిట్టికృత్యము మాన్పగలందుకు హైద్రాబాదు జీవరక్షాజ్ఞానప్రచార మండలివారికి తెల్పిరి- అందుకు వారుసమ్మతించి ఒకవారముపెంద లేకంచేసి గ్రామములో ప్రతిదినము ఉదయము నగరకీర్తన, సాయంత్రము అడ్తిబజారులో భజనోపదేశములుచేసి కీర్తనలుపల్కి జనసముదాయమునకు నచ్చజెప్పిరి ఇట్లునాలుగురోజులు పగలు రాత్రిప్రచారముచేసి యొందరినో వృత్తులనో అహింసాపక్షానికి మార్చిరి- అయినను యిక్కడికొందరు హింసావాదులరేలు యిద్దరుముగ్గురో జీవిపేరటబలియిపోతులను ఎనిమిదిగొర్రెలను బలియొసంగిరి.

---

అలించకుండ గడపుటకష్టమని ౧౫-౨౦ రోజుల నుండి వెట్టిమానినారు-

### విద్య

పెద్దమల్ కు మూడుమైళ్ళపైన పెంబాపురం మక్తాగ్రామంలో ౩౦౧ ఇండ్లు, ౧౧౩౫ మంది జనముండగా ఒక్క హరిజనమిషన్ మాత్రమే యున్నదికాని, గోవిందరావు మక్తేదారుగారు ప్రభుత్వసహాయముతో నడుపగల ఒకపాఠశాలను కూడ స్థాపించుట అవసరమని విలేఖరి సూచించినాడు-

### అంగడి

పెద్దమల్ గ్రామంలో చాలరోజులనుండి మానివేసినఅంగడిని మరలఇప్పుడు రెండువారములనుండి ప్రతిబుధవారము నడుపుచున్నారట- ధర అవిషయములోను మంచివ్యవస్థచేయబడినదట-

---

### మెదకుజిల్లా ప్రధానస్థానపు మార్పువదంతి

ఇప్పుడు మెదకుజిల్లా ప్రధానస్థానము సంగారెడ్డిలోనున్నది. తిరిగిదానిని మెదకుకుమార్తురని వదంతిపుట్టినదనుచు సంగారెడ్డినుండి ఓ. కు చేసుకు అనువారు దానినిమార్చరాదనికోరుచు ఒకలేఖ వ్రాసినారు.

సంగారెడ్డికితోష్టక్రిందిరోగములు కలిగించవిద నియు, అక్కడమంచినీటివసతి సమృద్ధిగానున్నదనియు, అది మెదకుజిల్లాలోని అన్ని తాలూకాలకు కేంద్రమనియు—అందువల్ల తాలూకాలనుండి జిల్లాప్రధానస్థానమునకు వచ్చురైతులు మున్నగువారలకు మంచిసౌకర్యమైనదనియు అలేఖలో చెప్పబడినది మెదకుజిల్లాలో నీళ్ళసౌకర్యవిషయంలో చాలకష్టమని వారువ్రాసినారు

ఇప్పుడు సంగారెడ్డిలో జిల్లాప్రధానస్థానము ఉండుటచే ఆఫీసులలోపనిచేయువారలకు గ్రామస్థులు ఇండ్లకిరాయలకిచ్చి జీవించుచున్నారు- బీదలు పాలు, పెరుగు, కట్టెలు మొదలయినవి అమ్ముకొని జీవించుచున్నారు నిర్మాణశాఖవారిచే చేయించబడేపనులలో అనేకులుబీదలు సంపాదనపొందుచున్నారు, ఇప్పుడు జిల్లాప్రధానస్థలమును మార్చుటవల్ల వీరలందరి జీవనమునకుకష్టమగునని విలేఖరిమొంలపెట్టినాడు జిల్లాఆఫీసులలోని ఉద్యోగులు సంగారెడ్డిలోకట్టుకొనియున్న యిండ్లను వదలిపెట్టవలెనవచ్చుటకు ఒక అసౌకర్యముగ అదనుచున్నారు, సర్కారు ఆఫీసుల కేకములు ఇప్పుడు మెదకుకుమార్చుటకు చాలఖర్చుఅగునని తుదిలక్షణగా అవిలేఖరివ్రాసినాడు-

### ఉస్మానాబాదులో గణేశోత్సవము

ఉస్మానాబాదులో గతసంవత్సరము గణేశోత్సవసమయమున అల్లరి జరుగుటచే ఊరేగింపును తెరిమివేయవలసివచ్చెను. ఈసారి అట్లుజరుగకుండుటకై అధికారులు కొన్ని నియమములనుపెట్టి పోలీసు రక్షణకొసగిరి- అందువల్ల శాంతముగా గణేశోత్సవము గడచిపోయినట్లు "దక్కన్ క్రానికల్"కు తెలిపినది- అగస్టు౨౪వతేదిన తాలూక్దారు, పోలీసు మెంహాతెమీంగారలు ఇతర అధికారులతోకలిసి రామమందిరములోని గణేశోత్సవాలకుపోయి మిఠాయిని సంగీతము పాడినవారికి పంచుటకై రూగింలు ఇచ్చిరి.

### వరంగల్లులో శాంతి

వరంగల్లులో గణేశోత్సవసందర్భమున అధికారులువిధించిన నిషేధాజ్ఞను సెప్టెంబరు ౧౪వతేది ఆదివారమునాడు శాంతిపరిస్థితులేర్పడుటచే తొలగించినారట.



బలహీనమైన బిడ్డలకు

డోంగ్రే

బాలామృతము

పుష్టియున్ను, బలమున్ను, ఆరోగ్యము నిచ్చును

## "ఈశ్వర్సుకుమద"

స్త్రీలకు కలుగు ఋతుశూలల, బహిష్టికాకుండుట, అకాలబహిష్టి, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, సంతానహీనత, ఎర్రకుసుమ, తెల్లకుసుమ, గర్భము పోవుచుండుట, గర్భాశయము తనస్థానమునుండి తప్పినపుడు కలుగుబాధలు, గర్భస్రావముచే కలుగుదోషములు నడుమునొప్పి, కాళ్లులాగుట, హిస్టీరియాను కుదుర్చును. నూతికానొప్పినిపోగొట్టును. గర్భాశయవ్యాధుల నన్నిటిని తగ్గించి ఆరోగ్యమునిచ్చును- 4 ఔన్సుల సీసా 1కి రూ, 1-14-0

ఈశ్వర ఫార్మసీ పి- బి- 127 మద్రాసు

ఏజన్సీ:--3168, కింగ్సువే, శికిందాబాదు.

## ఇండియాయొక్క రక్షణ స్థానములు




మనము పెట్టుబడిపెట్టు ప్రతి అణా, ఇండియా సైన్యమును, నౌకాదళమును, వైమానికదళమును బలపరిచి, ఇండియాను, శత్రుదాడిని ఎదుర్కొనుటకు శక్తివంతముగా చేయును.

మాతృదేశమును యుద్ధమునుండి కాపాడుటకు, ఇండియాయొక్క రక్షణస్థానములు దాని తీరములకు చాల దూరమునందు జాగ్రత్తగనున్నవి. రాయల్ ఇండియన్ నౌకాదళము ఇండియా తీరమును, దానికి బాహ్య ప్రపంచముతో సంబంధము కలుపు సముద్రమార్గములను రక్షించును. అభివృద్ధి చేయబడిన ఇండియా సైన్యము తన క్రొత్తయంత్రశక్తి నుపయోగించి, ఫాసిస్టుల గుంపులను ఇండియాకు దూరముగా తరుము గలదు ఇండియాలోని వైమానికదళము—ఆకాశమునందుండి పరీక్షించునది—ఇండియాపైకి దురాక్రమణ జరుపు శత్రువును హతమార్చును. ఈ రక్షణ కార్యమున కుపయోగింపబడు అధికమైన సాధన సామగ్రిఇండియాలో తయారు చేయబడినది ఇది ఇండియాలోని వస్తు సామగ్రికి, కార్మికులకు, ధనమునకు పని కల్పించినది, ముందు కల్పించును. ఇండియా రక్షణ నిర్వహణమున తమ వంతు నెరవేర్చుటకు మీ దేశము వారికి సహాయము చేయుచున్నారా?

ప్రతి పది రూపాయల డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్టు 3/9/- లాభము సంపాదించును పూర్తి వివరములు పోస్టాఫీసులలో తెలుసుకొనుడు

Gl. Te. 53.

**డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లను కొనుడు**



## బహుమతి రు. 10000/-

జల్లందర్ సిటీలో బంగారము తులం 1 కి రూ. 2/-

ఈక్రింద నదహరింపబడినవుత్తరము అబద్ధమని రుజువుచేయువారికి పైబహుమానము ఇవ్వబడును!

పేరి కామేశ్వరరావుగారు పెద్రూరునుండి 2-7-41 తేదిన వ్రాసిన ఉత్తరము: "నేను జి. టి. డోగ్రాఅండుకో, జల్లందర్ సిటీవారివద్దనుండి ఒకతులం బంగారము ఏప్రిల్ నెలలో కొని రెండు ఉంగరములు చేయించితిని- మీ "మోహిని" బంగారము మంచిబంగారముమాదిరిగనే గీటురాచి మీద గీతలుపడినవి- కాంతి ఏమాత్రమును తగ్గలేదు. దయయుంచి మరి 3 తులముల బంగారము పంపవలసినది." ప్రసిద్ధిపొందునటుల చేయుటకు తులం 1కి 2 రూపాయిలు పోస్టేజి ప్రత్యేకము. 3తులములు రు 5/- 6 తులములు రు 9/- 10 తులములు 15 రూ. మూడుతులములబంగారముగాని అంతకన్న ఎక్కువగాని కొనువారలకు పోస్టేజిఉచితము- ఉచిత బహుమతులు 3 తులములుకొనువారికి ఒకజతగాజులు ఉచితముగ ఇవ్వబడును, 6 తులములు కొనువారలకు చెవులపోగులజత ఇవ్వబడును. 10 తులములు కొనువారలకు కంఠభూషణము ఇవ్వబడును.

తయారుగానున్న ఆభరణములు..నూతనరకములముసుగులు జత 1కి రు2/- 8 జతలపెట్టు రు7/- అందమగుచెవులజతలు రు 2-8-0 బొంబాయి నాగరికతమాదిరిది రు 2/- చేతిగడియారపుపట్టా రూ2/- మెడలోని గొలుసు రు 5/- (ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషు తెలుగులో మాత్రమే జరుపవలెను)

జి. టి. డోగ్రా అండుకో (646) జలంధర్ సిటీ

# గోలకొండపత్రిక

వృషనామ సంII భాద్రపద బII౧౨
గురువారము


## వృత్తి విద్య

మెకంజీ విధానం అనే పేరుతో మనరాష్ట్రములో ఒక విద్య ప్రారంభమైనది. గ్రామవాసన పట్టణవాసన (rural bias, urban bias) అనేపద్ధతిపైన విద్యనురెండుశాఖలుగా చీల్చివేసినారు. గ్రామాలవారికి వ్యవసాయ ప్రధానమగు విద్యచెప్పింతురట. పట్టణశాఖవారికి పరిశ్రమప్రధానమైన విద్య నచెప్పింతురట. ఆపరిశ్రమలేవో యింకానిర్ణయముకాలేదు. వ్యవసాయసంబంధమగు వాసనగలవిద్య అనగా యెట్టిదో అదియు స్పష్టముకాలేదు.

ఇదియిట్లుండగాఇంగ్లాండు దేశమునుండి అబట్ అనే నిపుణుని పిలిపించివారిచే కొన్నివారాలు రాష్ట్రములో త్రిప్పి వారి అభిప్రాయములను పొందినారు. "వృత్తివిద్య" అనేపేరుతో వారొకచిన్న గ్రంథంవ్రాసియిచ్చి పోయినారు. దానిననుసరించియే రాష్ట్రములో వృత్తివిద్యలను నేర్పించుటకై హైద్రాబాదు ప్రభుత్వమువారు ప్రారంభించుచున్నారని తెలియవచ్చినది. ఇప్పుడు మూలవ్యయము ౩౪ లక్షలు వ్యయముచేయుదురట. మరియు ఏటేట ౫ లక్షలు వ్యయము చేయుదురట. ఈ వృత్తివిద్య పేరుతో వ్యవసాయ పరిశ్రమల విద్యచెప్పింతురు. అయితే యిది రాష్ట్రమంతటను చెప్పింపజాలరు. ఎందుకంటే వ్యవసాయవిద్యను కాని పరిశ్రమలను కానిబోధించేగురువులు లేరు. ఇప్పుడు ముఖ్యమగు పట్టణాలలో వ్యవసాయపరిశ్రమల పాఠశాల లేర్పాటుచేసి అచ్చట పంతుళ్ళను సిద్ధముచేయుదురు.

వ్యవసాయవిద్యకై రెండు ఉన్నతపాఠశాలలు, ఒకటి వరంగలులో ఇంకొకటి ఔరంగాబాదులో స్థాపింతురు. ఈ పాఠశాలలు కళాశాలలు కానందున ఇందలి విద్యపరిమితమైనదిగా నుండును. ఇచ్చట ఏభాషలోపాఠాలునేర్పుదురో ఏయేభాషలలో నేర్పుదురో ఆ వివరాలింకను స్వరూపము పొందినట్లు కానరాదు. ఒకటి తెలంగానాలోను ఇంకొకటి మరాట్వాడాలోను ఏర్పాటగుచుండుటచేత తెనుగు మరాటీ భాషలలోకూడా చెప్పింతురోయేమో తెలియదు. వ్యవసాయవిద్యను చెప్పించుటలో వ్యవసాయకముగజీవించువారికే ఎక్కువ అవకాశాలియ్యవలెను. వ్యవసాయానికేమియు సంబంధములేనివారు చదివితే వారు ఉద్యోగానికే చదువుచున్నారనవలెను. ప్రభుత్వమువారు వ్యవసాయకులకే ప్రాముఖ్యతయిచ్చుచున్నారనుటకు "చిన్న లేక పెద్ద సెద్యం సంస్థలను బాగాచూచుకొనునట్లు విద్యార్థులను సిద్ధం చేయుదురు" అని ప్రభుత్వమువారి ఉద్దేశము స్పష్టముచేయబడినది.

కేవలం వ్యవసాయంచేత వ్యవసాయకులకు లాభంలేదు. అందుచేత వ్యవసాయానుబంధమగు కోళ్ళ పెంపకము, పాడివృద్ధి, కూడానేర్పింతురు. ఇంతమాత్రముచాలదు. ఇందుకును చాలావృత్తులను నేర్పించవలసి యుండును. ప్రభుత్వమువారీ విషయములో ప్రవీణులసలహా పొంది నిర్ణయింతురుగాక.

పరిశ్రమ బళ్ళలో బాలురకొక విధానమున్నూ బాలికలకొకవిధానమున్నూ నిర్ణయించినారు. బాలురకు నేర్పించువాటిలో వడ్లపని, కమ్మరిపని, బెత్తముపని, నేత, బొమ్మలపని నేర్పింతురట. ఇవిసరియైనవికావు. మిల్లుల యుగములో చేనేతను ఎవరడుగుచున్నారు. కాంగ్రెసువారెన్ని ప్రయత్నాలు చేసినను నేతపై జీవించువారిలో మువ్వాతిక మంది కూలీలుచేసుకొని,లేక యితర వృత్తులనేర్చుకొనిజీవించుచున్నారు. వడ్లపని కమ్మరిపని చాలినంతఉండనేఉన్నది. ఆవృత్తులలో జీవించువారికే మేలైన పరికరాలతో మేలైనపనులు చేయుటకు ప్రధానముగా నేర్పించవలెను. బెత్తముపని మంచిదేకాని మన రాష్ట్రములో బెత్తము సర్వసాధారణముగా లభించునట్టిదికాదు. అందుచేత అదియెక్కువగా ఉపయోగకారి కాదేమోచెప్పజాలము. ఆపరిశ్రమలుకాక ఇంకను ఎక్కువపరిశ్రమలకు స్థానమిచ్చిన బాగుండునేమో?

బాలికలకు ప్రత్యేకశిక్షణమిచ్చుటకు బాలికల పరిశ్రమలపాఠశాలస్థాపించినారని తెలిపినారు? అదిబాగానే ఉన్నదికాని ఆపాఠశాల హైద్రాబాదులోనేకలదు- జిల్లాలలోని వారికి దానివలనలాభముపొందుటకు అవకాశము కల్పింపవలెను. బాలికలలో తెనుగు మరాటీ కన్నడ బాలికలను లాభముపొందుటకు ముల్కీభాషలలో బోధనుపర్పాటు చేసినారో లేదో తెలియదు.

తుదిలో "సైకలాజికలు పారశాల" అనునది స్థాపింపనున్నారనియు, దానిని నిరుద్యోగ సంస్థవారు నడుపుదురనియు యువకులుతమకు ఉపకరించే ఉద్యోగాలకే సిద్ధమగునట్లు దానిద్వారా మార్గదర్శకత్వము లిగింతురనియు తెలిపినారు. ఆదెట్టిపాఠశాలయో, యేమోమనకు తెలియదు. ఉద్యోగాలకు మంచిజీతము, కావలసినన్ని సెలవులు, పెన్షనులు అధికారము మున్నగు ఇతరాకర్షణలు ఎంతవరకుండునో అంతవరకు ఏసైకలాజికల్ పాఠశాలకూడా ఏమిన్ని ఉపకరింపజాలదు. కాంగ్రెసువారన్నట్లుగా ఉత్తమోత్తమ మానభృతి (జీతము) ౫౦౦ రూII కన్న మించకుండా ఏర్పాటుచేసిన దేశానికి అదొక్కటే సరియైనసైకలాజికల్ పాఠశాలగా అదంతకదే ఏర్పడగలదు.

హైద్రాబాదు ప్రభుత్వమువారు చేసేప్రయత్నాల కనుబంధముగా మేమునూచనలు చేయుచున్నాము కాని వారిచర్యలు విమర్శించవలెనను పట్టుదలతోచేయుటలేదు. పైగా ఈ విధమగు విద్యక్రొత్తగా ప్రారంభమగు చున్నందున దేశహితమునుకోరు వారందరును తమతమ అభిప్రాయాలను స్పష్టముగా తెలిపి సాధక బాధకములను ప్రభుత్వము వారికి నివేదించవలెనని కోరుచున్నాము.

## స్థానిక వార్తలు

### నల్లాలలో నీటితగ్గింపు

గండిపేటచెరువులోనీరు చాల తక్కువగానున్నది-అక్కడనుండినల్లాలకు నీరుపంపుటకై స్టోరుచేసియుంచెడి స్టోరేజిలోకూడ నీరుతక్కువగానున్నది-అందుచే ౧౯౪౧ంభ-ఆబాన్ ౧౫ వతేదీనివారమునుండి, పండుగలరోజులలోకూడ ఏ మాత్రము మినహాయింపులేకుండ ప్రతిరోజుదయము ౫౼౪ గంటలనుండి ౯౼౪గంటలవరకును సాయంత్రము ౪ గంటలనుండి ౭ గంటలవరకును మాత్రమే నల్లాలలోనీరు వదలబడునని ప్రభుత్వ ప్రకటనశాఖవారు తెలుపుచున్నారు-

నీటిపరిస్థితిచాలాకష్టముగా ఉన్నందువల్ల నీళ్లు వాడుకు నేవారలు చాలపొదుపుగా వాడుకొన్నచో అధికారులపని ఎంతోసుకరముగాఉండునని కోరనైనది.

### రవీంద్రుని గూర్చి ఉపన్యాసము

హైదరాబాదు (దక్కన్) నగరమందు సుల్తానుబజారులో కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయములో ౧౧ సెప్టెంబరుతాదు శుII సాII రవీంద్రుని గురించి ఆ నాస్తికయావిద్యాపీఠపు ప్రాధ్యాపకులగు శ్రీ కిరణ్ చంద్రదత్తుగారు ఉపన్యసించిరి-టాగూరుగారి కవిత్వమును గురించి విపులంగాచెప్పిరి- పల్లారు సూర్యనారాయణరావు, బి ఏ.,బి ఎల్.,గారు అధ్యక్షత వహించిరి.

### పట్టణములో దుండగము

(ఒకవిలేఖరి)

ఈనెల ౧౪ తేదీరాత్రి ౯ గంటలకు రామకోటి ........ అనువారు గౌలిగుడంలో ఒకస్నేహితునిఇంటికి పోవుచుండగా మధ్యలో ఒక వ్యక్తితో కల్సికొనుట జరిగినది- ఆతడు వారిని ఒక అగ్గిపుల్లకై అడిగినాడట- వారు ఇచ్చినంతనే ఒకరూపాయ ఇవ్వమన్నాడట-వారు నిరాకరించినంతనే కోటుజేబులో చేయివేసి గుంజినాడట-వెలుపలికి లాగుటచే క్రిందబడ్డ సులోచనములు పోగా వారిని కాలితో తన్ని ... మాటలాడిన, లాఠీతో కొట్టుచుండగా కానిస్టేబులు వచ్చి వారిని రక్షించెను. ... బలాత్కారముగా తప్పించుకొని పోయినాడట- చీకటిగానుండుటచే అతనిని పట్టుకొనుటకు వీలుచిక్కనదికాదు.

### అత్యవసరమైన టప్పా అందజేయు ఏర్పాటు

సికింద్రాబాదు, ఖైరతాబాదు, చాదర్ఘాట్, హైదరాబాదు సదర్ టప్పాఖానాలనుండి అత్యవసరంగా పంపవలసినజాబులకు ప్రతి జాబుమీద సాధారణఛార్జీగాక మరిరెండణాల టిక్కెట్లు అంటించి, టప్పాలావారినుండి అత్యవసరమైనది ఆగమనాటలుగల బిళ్లలను సంపాదించి అంటించి వేసినచో పంపించేఏర్పాటుకరీఫ్ధర్మము కాక్కాలికముగాచేసినారు. ఇట్టిజాబులు ప్రొద్దున౭గం. లనుండి సాయంకాలము ౭గం.లవరకు పంచిపెట్టేఏర్పాటు చేయబడినది.

### ఆర్యప్రతినిధి సభ

హైదరాబాదుసంస్థానపు ఆర్యప్రతినిధి సభవారు సెప్టెంబరు౭వ తేది ఆదివారమునాడు సమావేశమై హాజరుగా, జాగీరులలో తమప్రచారము సాగించుకొనుటకును, దసరాఉత్సవములు జరుపుకొనుటకునుగల ఆటంకములను గురించి ఆలోచించినట్లు తెలియుచున్నది.

—(దక్కన్ క్రానికల్)

### ప్రధాన మంత్రిగారి గౌరవార్థము

ఆబాన్ ౧౪వ తేదిరాత్రి బాలార్జంగుగారు ప్రధానమంత్రిగారి గౌరవార్థమొక విందుచేసిరి. దానికి రజాఅలీగారును, సర్ మహమ్మదయాఖూబుగారును కూడ పోయియుండిరి.

### క్రొత్త పత్రిక స్థాపన కనుమతి నిరాకరణ

పండిత వినాయకరావు బారట్లాగారు "ఖుర్షీదుదక్కన్" అనుపేర ఒకపత్రిక తీయుటకై అనుమతిఅడుగగా ప్రభుత్వమువారు నిరాకరించిరని చెప్పుచున్నట్లు "దక్కన్ క్రానికల్"లో వార్త వచ్చినది.

### మార్వాడి మహాసభ

హైదరాబాదుసంస్థానపు మార్వాడిమహాసభ ఔరంగాబాదులో నవంబరు ౧-౨-౩,౧౯౪౧. ౧౯౪౧ తేదులలో జరుగనున్నది.

౨౧ఏండ్లు మార్వాడిసంస్థ అన్నిటితో సంబంధముగలిగి పనిచేసిన రామకిషన్ ధూత్ గారు తనతోడి కార్యకర్తలతోకలిసిన కొన్ని అభిప్రాయభేదములవల్ల వాటిఅన్నిటితోను సంబంధములను వదలుకొన్నామని ప్రకటించినారు.

### రజాఅలీగారు

నేడు ౧౫ సెప్టెంబరునాడు హైదరాబాదు (దక్కన్) నగరమును వీడి ఔరంగాబాదుకు ప్రయాణమైరి-అక్కడినుండి వారు ఢిల్లీకిపోగలరు

### ప్రధానిగారికి పురపాలకసంఘ గౌరవము

హైదరాబాదు పురపాలక సంఘమువారు సెప్టెంబరు౯వ తేదిన ఉపాధ్యక్షుడగు శ్రీధరనాయుడుగారిఅధ్యక్షతలో సమావేశమై క్రొత్త ప్రధానమంత్రిగారికి సన్మానముచేయుటకై వినతిపత్రము తయారుచేయుటకై ఆరుగురుసభ్యులుగల ఒక ఉపసంఘము నేర్పాటుచేసిరి.

### మోటారు టాక్సీలవారి కష్టాలు

చాలినంతపెట్రోలుదొరకుటలేదని మోటారు బస్ అండ్ టాక్సీయజమానులవారు అధికారులతో మొరపెట్టుకొనుటకై ఒక రాయబారివర్గమును పంపించగలరని "దక్కన్ క్రానికల్"కు తెలియుచున్నది.

### గాంధి జయంతి

హైదరాబాదు ఖాదీప్రచారక సంఘంవారు గాంధిజయంతిని ఆబాన్ ౧౯ నుండి ౨౫వరకు జరుపనున్నారు- ౧౯ఆబాన్ నాడు ఉదయం వారి కార్యాలయమునుండి ప్రభాత్ ఫేరి వెడలును. ౧౯సెప్టెంబరునుండి ౨౫సెప్టెంబరువరకు అఖండ చరఖాసప్తాహమును జరిపెదరు. సెప్టెంబరు ౨౫వ తేదిన పెద్దసభజరుగును. ఆజయంతిలో వడికేనూలును గాంధిమహాత్మునికి పంపెదరు.

హైదరాబాదు సాంఘికసేవాసంఘమువారునూడ సెప్టెంబరు౨౮వ తేదినుండి అక్టోబరు౭వ తేదివరకు గాంధిజయంతి జరిపెదరట. బహిరంగసభ, వ్యాసరచన పోటీలు, సాంఘికకుటీర్ల మెంటు, సందులపరిశుద్ధి మున్నగుకార్యక్రమము ఏర్పాటు చేసికొన్నారు. హరిజననిధికై ధనము వసూలు చేసెదరు

### నైజాంస్టేట్ రైల్వేబోర్డు

ఈబోర్డు ఇంతకాలము లండనులో ఉంటుండెను-ఇప్పుడుఇది సికింద్రాబాదుకు మార్చబడును. దానికి మేనేజింగుడైరెక్టరుగా ఇప్పుడుజనరల్ మేనేజరుగాఉన్న స్లేటర్ దొరగారు నియుక్తులైనారు.

### క్రొత్తపరిశ్రమల కంపెనీకి ప్రభువుగారి ఆమోదము

ని. ప్ర. శ. నిజాం ప్రభుత్వప్రకటనశాఖవారు గావించినయొక ప్రకటనచే ఈక్రిందిసమాచారము తెలియుచున్నది.

ఇప్పటియుద్ధమునకు అవసరములైన ఏవిధరకు లను హైదరాబాదు రాష్ట్రములో ఉత్పాదనచేయవచ్చునో వాటినిచ్చుట ఉత్పాదనచేయించి బ్రిటిషువారియుద్ధపుఅవసరములకై అమ్మేఏర్పాట్లుచేయించుటకై ప్రభుత్వమువారిచే పరిశ్రమశాఖమంత్రిసలహాదారుడుగ నియుక్తుడైనఅధికారి కృషి చేయుచున్నాడు. ఆఅధికారి 'ఈస్టరన్ గ్రూపుకాన్ఫరెన్సు' అనబడుసభకు పోయివచ్చిన తర్వాత హైదరాబాదునందలి కొందరు వర్తకులతోను పరిశ్రమాధిపతులతోను యుద్ధసమయంలో కొంతకొన్ని పరిశ్రమలుస్థాపించినమంచిలాభముండునని వివరించిరి. ఆవిషయమును ఆసమావేశములో చెప్పిరి-ఇట్లుచాలాదూరము సంభాషణలు జరిపినతర్వాత ఎవరునుత్వరలోనే ఆధికారిచెప్పినటువంటి పరిశ్రమలను ప్రారంభించుటకుసిద్ధముగలేరని తెలిసినది- అందుచే సికింద్రాబాదులో ఒక పారిశ్రామికసంస్థసిద్ధపడగా, అతడుతయారుచేసినపరిశ్రమప్రణాళికను ప్రభుత్వమువారు పరిశీలించి, కొన్ని మార్పులు సూచించిరి- ఆమార్పులతోపారిశ్రామికుడు సమ్మతించినతర్వాత ఆప్రణాళిక మ-ఘ-వ- ప్రభువుగారిఆమోదమునకై పంపబడెను. ఇప్పుడాప్రణాళికకు ప్రభువుగారు ఆమోదమొసగినారు.

ఈప్రణాళికప్రకారము "హైదరాబాదు కంపెనీలశాసన"మునుసరించి ఒక పెద్దకంపెనీ స్థాపించబడును. రసాయనపదార్థములు (గంధకామ్లము, దానినిచేసేటప్పుడు వచ్చేపదార్థములు) గాజుసామానులు,స్లేటులు,మరియుప్లాస్టిక్ కేసీనుమున్నగువానిని ఆకంపెనీచే తయారుచేయించబడును.

ఆకంపెనీయొక్క మూలధనము ప్రభుత్వమువారు నిర్ణీతము లైన వాటాలన్నియుపూర్తిగా వసూలైనతర్వాత మిగిలినదగు మూలధనమును ప్రభుత్వమువారు సంవత్సరమునకు ౧౫౦లక్షలవరకు ... ఇచ్చెదరు. ఆకంపెనీ ఉత్పత్తివస్తువులను కాని వేరేవస్తువులను తయారుచేయుటకైనను, ముందుగా ప్రభుత్వమువారి అనుమతిపొందుట విధియైయుండును-ఆపరిశ్రమలలో కొన్ని ఈరాష్ట్రములో ప్రారంభించుట ప్రథమముగనుక, ఆపరిశ్రమలను ప్రభుత్వమువారు పెట్టుబడిపెట్టేదబ్బుకు నష్టములేకుండజేయుటకు అవసరమగుటను, యుద్ధానంతరము ౧౦ఏండ్లవరకు ఇతరపరిశ్రమలను నూతనముగా స్థాపించుటకు అనుమతియునగకుండుటకు ప్రభుత్వమువారు ఒప్పుకొన్నారు.

ఇట్టిదు దీనికి కావలసిన యంత్రసామగ్రిని అమెరికాలో తయారుచేయుటకై ప్రభుత్వార్థికశాఖలోని ఒకఅధికారిని ప్రభుత్వమువారు పంపుచున్నారు-ఇతని ప్రయాణసంబంధములో అయ్యేఖర్చులలో సగము కంపెనీవారే ఇచ్చుకొందురు. ఈఅధికారి పరిశ్రమశాఖ మంత్రిగారి సలహాదారుని ఆజ్ఞానుసారము పనిచేయును. ఇతరప్రభుత్వశాఖలన్నిటియొక్క అత్యవసరములైనపనులను నెరవేర్చుటకు అమెరికాలో నుండగలడు.

కంపెనీవారి వ్యవహారములనుజరుపు సంఘమునందు సగమునుండి ప్రభుత్వప్రతినిధులై యుండగలరు, ఖాన్బహదూర్ అహమ్మద్ అలావుద్దీన్ గారు మేనేజింగుఏజంటుగా నుందురు. వర్తకులు,కొనిదముపరిశ్రమలస్థాపన సందర్భములోవిధం. ఆవసరమగు ఈమేనేజింగుఏజంటుకునుండును!

# మైసూరు దసరా ఉత్సవములకు

# చౌకరిటుర్ను టిక్కెట్లు

19వ సెప్టెంబరు 41 నుండి 30వ సెప్టెంబరు 41 వరకు రెండుపోవుటలతోసహా 1, 2, 3 తరగతులకు చౌకరిటర్ను ప్రయాణపుటిక్కెట్లు, మైసూరునకు, హైద్రాబాదు ఎం. జి. మరియు సికింద్రాబాదులనుండి (ద్రోణాచలం, హిందుపూరులమీదుగా) ఈక్రిందనుదహరింపబడిన చార్జీలతో అదనపుచార్జీలుగలుపుకొని యివ్వబడును.

మైసూరు రానుపోనుచార్జీలు

| | 1వ తరగతి. | | | 2వ తరగతి. | | | 3వ తరగతి. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | రూ. | అ. | పై. | రూ. | అ | పై. | రూ. | అ. | పై. |
| సికింద్రాబాదు ... | 106 | 14 | 0 | 44 | 3 | 0 | 14 | 11 | 0 |
| హైదరాబాదుఎం. జి. | 104 | 13 | 0 | 43 | 10 | 0 | 14 | 9 | 0 |

15వ అక్టోబరు 1941 తేదిరాత్రి 10 గంటలలోగా ప్రయాణముపూర్తిచేసికొని తిరిగివచ్చుటకు మాత్రమే చెల్లును. ఏపరిస్థితులలోగూడ ఈటికెట్లడబ్బు వాపసుచేయబడదు.

ఇతరవివరములకు,

హెడ్క్వార్టరు స్టేషన్మాస్టరు లేక ఛీఫ్ కమర్షియల్ మేనేజరు.
హెచ్. ఇ. హెచ్. ది నైజామ్సు స్టేట్ రైల్వే,
సికింద్రాబాదు.

# అనావృష్టిబాధలు

## ఇంకనుదోపిడ్లు

అనావృష్టివల్ల తెలంగాణాలో రైతులు, పశువులుపడుచున్న బాధలనుగురించి మాకింకను వార్తలువచ్చుచున్నవి. నల్లగొండజిల్లా ఆంధ్రజనసంఘమువారికి ఆజిల్లాయందలి తాలూకాలలో అనేక గ్రామములనుండి ఈబాధలవిషయమై నివేదికలు వచ్చినవి. వాటినుండి ఇపుడు నల్లగొండతాలూకాలోని చిత్తలూరుగ్రామముయొక్క పరిస్థితులను గురించిననివేదిక మాకుపంపబడినది. చిత్తలూరువరకే మూసానది వెంబడి మరియుదానికిసమీపములోనుండి మునిపల్లె, గురిజాల,తుడిమిడి, వంగమర్తి, ఇటిక్యాల్ పహాడ్, గౌరవరం,మాధవరం, అకవరం, అడ్లూరు మున్నగు గ్రామాలస్థితి ఇదేవిధముగనున్నట్లు చెప్పబడినది.

చిత్తలూరులో మూసానదినుండి ప్రత్యేకాలువలుతీసి ఆనీటితో పరిసేద్యముచేసెదరు. కాలువలలోనీరు ఆరంగుళములలో ఉండుటకుమారు మూడంగుళములలోనే సాధారణంగా ఉండును. దానికితోడుగా వర్ష సమృద్ధిఉండినపుడు పైరులు ఒకవిధముగాపెరుగుచుండును. కాని ఈసారిసంవత్సరాదిలో రెండంగుళములలోతునీరేయుండెను వర్షములు లేకపోయెను. అందువల్ల అన్నిక్షేత్రాలను నాట్లుపెట్టక కొన్ని సెంబర్లభూములలోనే నాట్లుపెట్టినారు-ఆవిమూడ ఎందుకు సంభవించుచున్నది-రోగములు కూడ కొంతతగిలిపాడైనది-బావులక్రిందిభూములవిషయములో బావులలోని పూడికలుతీయించినను సరిపోవునీరు రానందున కొంతకొంతభూమిమాత్రమే నాట్లుపెట్టబడెను-అనాట్లుఎండిపోయినవి, వేయబడినకర్రలు వరినీటికొరకవలవలెండిపోయెను విపర్యాసమైన గాలివల్ల తాలుపోయి రూపాయలకు రెండణాలనుండినాల్గణాలవట్టుకుమాత్రమే ఫలించినది. అదిమాలివ్యయములకుసరిపోవును ఇదంతయు ఆబీ సేద్యమువిషయము-

ఖరీఫుపైర్లు రేగడిభూములలో వర్షమూసరిగాలేక జొన్నలు పెరిగి ఎండకుగాలికి పూర్తిగానశించినవి. ఇకముందువర్షయతురినను ఫలించవు. మేత కూడదొరకదు. ఎర్రదుబ్బభూములలో రూపాయికి పావలావంతుసపచ్చపచ్చగానున్నవి-పుబ్బకార్తెలో గొప్పవర్షంపడినచేగాని కొద్దిగానైనదక్కుండదు.

కృషి పశువుల మేతకై ౧౫నెలనుండి సూర్యాపేట, మహబూబాబాదు తాలూకాలలోని గ్రామాలలో రూ౧కిరెండువాపులచొప్పున వరిగడ్డికొనుచున్నారు-అదికూడ అయిపోవచ్చినది- నిడిగొడ్లను చాలవరకు జనగాము, మహబూబాబాదు తాలూకాలలోని గ్రామాలకు తోలుకొనిపోయినారు.

రైతులలో అనేకులవద్ద తమతమతిండి, జీతగాండ్రగాసము పెండ్లయినఖర్చులకు ఏమాత్రం గల్లాపెండలయినవి లేకుండా అయిపోయినవి.

### ఆసిఫాబాదు జిల్లా పరిస్థితులు

ఆసిఫాబాదుజిల్లాలో రైతులు రెండునెలలు ఆందోళనపడినతర్వాత వర్షములుపడినను, వాటివెంట కీటకములుపడలి ప్రత్తి మొక్కజొన్న మున్నగుపైరులు రూపాయిలోగరఆణాలవరకు నశించినట్లు మావిలేఖరివ్రాసినాడు. కొందరురైతులు వ్యవసాయశాఖ దారోగాగారివద్దకుపోయి ఔషధముడుగగా అట్టిదేదియులేదని చెప్పినారట.

చౌకిదారులు బంచరాయి పనులలో చాలకాఠిన్యము చూపుచున్నారట,

జొన్న మున్నగుధాన్యమును ఇతరగ్రామాలకు పంపకూడదనియు, ఇతర గ్రామాలనుంచి తేరాదనియు ౨-౧౨-౧౩౫౦ ఫ-నాడు చాటింపు చేయించబడినది.

### వరంగల్లు

వరంగల్లులో తాలూక్దారుగారు మార్కెటులందు బియ్యమును ఇంతకంటెఎక్కువ అమ్మరాదనిఒక నియమమును ఏర్పాటు చేసినట్లు "దక్కన్ క్రానికల్" పత్రికలో తెల్పబడినది.

### కొప్పల్ జాగీరు

ఇక్కడ వర్షముకొఱకై ౧౦౦౦మంది రైతులకు అన్నదానముచేసి దేవళములలోను, మసీదులలోను ప్రార్థనలు జరిపించినట్లును "దక్కన్ క్రానికల్"లో వార్తగలదు. పైరులెండిపోయినవి-మేత. ధాన్యము చాలకుండా ఉన్నదట-కొందరు పనులకొరకై బ్రిటిషిండియాకువెళ్లిపోవజూచుచున్నారట- రాయచూరులో సెప్టెంబరు ౨వతేదికిముందు నాలుగురోజులనుండి కొద్దికొద్దిగ వర్షములుపడినవట.

# కమవుదోపిడి

రామాపురము, ౪-౧ ౧-౧౩౫౦ ఫ-

(ఒకవిలేఖరి)

ఈగ్రామము తా॥ వరంగల్ లో చేరినది. ఇచ్చటసకాలమున వర్షములుకురియనందున పునాసపైరులు చాలనష్టమైనవి. బావులక్రింద స్వల్పముగావరిపైరులు సేద్యముచేసినారు. కూలిచేసికొని జీవించువారికి కూలిపనులు సరిగాలభించుటలేదు- అందుచే బీదప్రజలు మరియు కార్మికులు ఆకలి మంటలచే అలమటించిపోవుచున్నారు. కాలము సమృద్ధిగాఅయినచో చేతినిండపనులుండి కూలివారికిపొట్టనిండెడిది రైతులు ధాన్యమును మెచ్చుగానో, అప్పుగానో ఇచ్చెడివారు. కాలపరిస్థితులచే రైతులు ఇతరులకు ఇచ్చునట్టిస్థితిలో లేరు-

ఆయిన ప్రతిరైతు తమయొద్దనున్న జీతగాండ్లకు, మరియు తెగచేయుమాదిగవాండ్లకు మూడునాలుగు మాసములజీతము ముందుగాఇచ్చినారు మరియు కొంతధాన్యమును అప్పుగాసహితమిచ్చినట్లు తెలియుచున్నది. కూలివాండ్లకుతప్ప యాజీతముచేయువారికి మరియు తెగచేయువారికి ఆహారవిషయమై ఇబ్బందులేమియులేకుండెను. ఆయినప్పటికి చ॥ ౪ ఆబాన్ ౫౦ ఫ. మంగళవారం రాత్రి ౧౨. ౯ సమయమున తెగచేయువారిజనులందరును మరికొందరి రైతులజీతగాండ్లుకలసి దాదాపు ౫౦ మంది రైతులపండినపైరుల లూటీ చేయప్రారంభించిరి- ఈసంగతి తెలిసి గ్రామమునుండిరైతులువెళ్ళి వాండ్లనుపట్టుకొనప్రయత్నము చేసి ఒక ౯ మందినిమట్టుకు పట్టుకొనగలిగిరి- తక్కినవాండ్లుమూటలతో సహా పారిపోయిరి- పట్టుబడినవాండ్లు పారిపోయినవాండ్లలో ౩౪ పేర్లనుచెప్పినారు- తెల్లవారినతర్వాత మరి ౧౩మందిదొరికినారు- యావిషయమును ఇచ్చటికి మూడుమైళ్లదూరముననున్న అమీనుకచ్చేరికి తెలియచేయడమైనది- అమీనుసాహెబుగారువచ్చి పంచునామచేసి మూటలను మనుష్యులను అమీనుకచ్చేరికితీసికొనిపోయినారు- అచ్చట జమానతుపైన అందరినివిడుదలచేసినారు- ముందు ఏవిధముగు చర్యనుతీసికొందురో తెలియుటలేదు. యాదోపిడియందు పనిలేనికూలివారు యేమాత్రముపాల్గొనలేదు- యాపనిచేసినవారు పలుచోట్ల దోపిడ్లు జరుగుచున్నవి మనము చేసిన యేమిచేయుదురనిన ధీమాతోనటుచేసినట్లు తెలియుచున్నది- ముందు ఎంకెట్టిసంఘటనలుకలుగనున్నవో దైవానుగ్రహమెట్లున్నదో తెలియదు-

పనులులేని కార్మికులవిషయమై దయామయులగు ప్రభుత్వమువారు పనులుకల్పించిన యాకష్టములుదూరమగును. ఇచ్చటమంచినీళ్లబావి ఒకటికూడసర్కారువారిచే యేర్పాటుచేసిలేదు-ఇచ్చటలోకల్ ఫండు ఆదాయము రు- ౭౦౦ కలదు. మాల్గుజారి రు- ౧౨౦౦ కలదు. ఇచ్చటి జనసంఖ్య ౧౯౨౫ కలదు. కాబట్టి ఒకబావిత్రవ్వించిన ప్రజలందరికి చాలమేలుగాయుండును. కార్మికులకు పనులువారికిసంతృప్తిగా యుండును. యాప్రార్థనమును ప్రభుత్వమువారు గమనింతురని విశ్వసించుచున్నాము.

### దారిదోపిడి

అయ్యగారిపేటనుండి ౨౩ మొహరునాడు ఒకరువెళ్లుచుండగా మధిరతాలూకాలోని పత్తుపల్లి గ్రామంవద్ద మధ్యాహ్నము దాటినతర్వాత ౨౬ మందివచ్చి ఆబాటసారినితలపైనను. శరీరముపైన మకొట్టి. ఆతనివద్దకొంతడబ్బును, పైకండువాను లాగుకొని, చొక్కానంతయుచీలికలుచేసి పంపించినట్లుగా పోలీసుముంతజింగారికిని, ఖమ్మం సర్కిల్ పోలీసుఅధికారికిని, వరంగల్లుజిల్లాపోలీసుఅధికారికిని మొఱలుపంపుకొన్నట్లు ఒకవిలేఖరివ్రాసి ఇంతవరకు పోలీసువారు ఏమిచేసినట్లును తనకుతెలియుటలేదని తెలిపినాడు.

### రఘునాథపల్లి అవసరములు

రఘునాథపల్లి జనగామతాలూకాలో రైల్వేస్టేషనుఉండే గ్రామము- ఇక్కడిబాటలుబురదతోను, చెత్తతోనునిండియున్నవి. వర్షాకాలంలో బాటపైబండ్లుదిగబడుచున్నవి- ఇక్కడసుమారు ౨౦కుటుంబముల సాహుకారులున్నారు, వారలవద్ద రైతులతో క్రయవిక్రయములప్పుడుమామూలుచేసినట్టి ధర్మఖర్చుపైకమునదిగలదు, దానినిఆసాహుకారులు రైతులబండ్లువచ్చేటందుకు వీలుగనుండుటకై బాటనుబాగుచేయించుటకు వ్యయపరచిన బాగుండునని ఒకవిలేఖరిసూచించినాడు.

ఈగ్రామములో దేవాలయనిర్మాణ నిమిత్తము ౧౩౪౯మహా౧౩౫౦ఫసాడు ఇటిల్లాహామాలు జారీచేసియున్నను ఇంకనుఅను జవాబుకలేదని ఆవిలేఖరియే పైతెల్పిన తన౧౨-౯-౧౧౪౧నాటి లేఖలో తెల్పినాడు.

మరియు కరవుకాలమని అక్కడివర్తకులు హరిజనులకు రెండుపుట్లు ధాన్యము నిచ్చియున్నారట.

